# పావనీ శతకము








**రచయిత:**

కాములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి

భాషాప్రవీణ విద్యార్థి

# మనవి

వయసున, పాండిత్యమునను పిన్నవాడ నైనను దైవ కృప, గురు కృపాకటాక్ష వీక్షణమునను కవితాశక్తి నన్నాద రించి మన్నించిన కారణమున నేనీ కృతికుద్యమించితిని. ఇందేవేని దోసగులున్నను గుణగ్రాహులైన బుధులు సహృదయముతో నరయ ప్రార్థన.

ఈ శతక ముద్రణవిషయమున సహకరించిన వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ప్రత్యేకముగా నన్నిట సహకరించిన మిత్రశ్రీ అప్పరావుకు, శ్రీఅన్నదానం చిదంబరశాస్త్రిగారికి నాధన్యవాదములు.

సహృదయముతో చక్కగా ముద్రించి యిచ్చిన శ్రీ వెంకట రమణ ప్రెస్సువారికి కృతజ్ఞతలు.

లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు

ఇతిశమ్.

: తఱుండుపు ఇట్లు

సుజన విధేయుఁడు

తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి

1—11—1972

వ్యాకరణ విద్యా ప్రవీణ, ఉభయభాషా ప్రవీణ
సాహిత్యాలంకార
పోతుకుచ్చి సుబ్రహ్మణ్య శాస్త్రి
పండిట్ : కె. యల్. యన్. యస్. కాలేజి

శ్రీ శ్రీనివాస భవన శ్రీ
మోటుపల్లివారి వీధి,
కొత్తపేట
తెనాలి.
19-11-72

## ఆశీస్సు

ఇది శతకము. ఈ శతకకర్త యన్తేవాసి, తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి. ఈతఁడు తనయిష్టదైవ మగుపావని నష్టోత్తరశతసంఖ్యాకము లగుపద్యసుమములతోఁ బూజించినాఁడు. అదియే యిందలి ప్రతిపాద్యము అందులకే యిది 'పావనీశతకము'.

శతకరచన మహాకావ్యరచన కాకనంది. ఇందు భక్తిప్రపత్తులు కరుణరసోద్దీపితములై సాధారణముగా వెలయుచుండును. దేవతానుగ్రహసంపాదనము, కవితాసిద్ధహస్తత దీనికిఁ బ్రధానలక్ష్యములు. కవులు మహాకావ్యరచనకు ముందు శతకరచనసాగించుట యొకకవి సంప్రదాయమునకుఁ జెందినది. ఆసంప్రదాయమును బాటించుచుఁ దా నీశతకరచన సాగించినాఁ డీతఁడు. ఆయాపట్టుల నీతఁడు వినిపింపఁ గొన్నిపద్యముల నిందుండి వినఁ గల్గితిని. ధారాశుద్ధి గలయీతని కవితల్లో ముందీతని సిద్ధహస్తుఁ గావింపఁ గల కవితాచ్ఛాయలు గొన్ని పొడగట్టినవి.

ఏతదుపాస్యదైవ మగుపావనియే యీయన్తేవాసిని దీర్ఘాయుష్మతునిఁగా నొనర్చి, కవితాప్రాగల్భ్య మితోఽధికముగా నీతనికి సంఘటించి రససిద్ధుఁడగుకవి వతంసముఁగా నీతనిఁ జేయుఁగాక!

— పోతుకుచ్చి సుబ్రహ్మణ్య శాస్త్రి.

నందిరాజు యోగీశ్వర భిక్షు
సెక్రటరి
భావోదయ సాహితి

తే. దీ. 24-11-72

# అభినందనలు

శ్రీరఘు రామ పద్మపద సేవన మే భవబంధ వాహినీ
తారక మంత్రమంచు సతతమ్ముసభక్తి నుతించి గొల్చు నా
మారుతి పాదపద్మములె మాకును పెన్నిధి యంచు నెంచి స
త్సార కవిత్వ ధార రస సారుని బావని గంటి వో సఖా!
పవన తనూజు పాదముల బట్టి భజించితి భక్తితోడ స
త్కవనమే దివ్య పుష్పములు గా నొనరించితి యుష్మన్మనో
భవమగు భావనా తతుల బావని కంకితమిచ్చినావు నీ
కవితకు మీకునున్ శుభము కల్గగ జేసితి గాదె మిత్రమా!
తీయని మాటలున్ మిగుల దీయని భావము లెల్ల జేర్చి శో
భాయుత మౌచు మీ కవిత భాసిలు చుండగ నే సుధా రసం
బోయన సాగి పోయినది పూర్తిగ మీ శతకంబు గాంచి యా
హా యన రే బుధుల్ తమ మహత్వ కవిత్వ పటుత్వ తత్వమున్
కార్తిక చంద్రికా జనిత కాంతి హిమంబుల లీల లీల స
న్నర్తన మాచరించె కవనంబును జూడగ దైవ మారుతీ
మూర్తిని గొల్చు భక్తియు ప్రమోద కవిత్వపు ధార దక్షిణా
మూర్తి కవిత్వమై వెలసె మోహన మంజుల గీతికా ధ్వనిన్.
మారుతి సాధు భక్తజన మానస పుష్పసు భక్తిమాధురీ
సార వహించు మీ కవిత సార విశేష మరంద మాధురీ
ద్వారమునన్ సదా మహద పారకృపారససారధార పెం
పారగ బ్రోచు గాత మిముఁ బావని పాయక యెల్లవేళలన్.

— నందిరాజు యోగీశ్వర భిక్షు

నాకు దయతో నాశీస్సుల నందించిన శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్య శాస్త్రి గురువుగారికి వినయపూర్వక కృతజ్ఞతలు. మిత్రశ్రీ యోగీశ్వర భిక్షుకు హృదయపూర్వక ధన్యవాదములు.

— తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి

శ్రీవాయగురవేనమః

# దైవప్రార్థన

నిత్యవినూత్నదంపతు లనిందితతేజులు సర్వలోకసం
స్తుత్యు లమేయసంపదల శోభిలు దివ్య పురాణమూర్తులున్
నృత్యకళాప్రియుల్ రసపునీత మహార్థకశబ్దరూపులున్
సత్యసమేతులై తనరు శక్తితదుక్తులు బ్రోచుగావుతన్

వాణి సరోజపాణి యభివందిత సర్వనిలింప మానవ
శ్రేణి వినీలవేణి సరసీరుహసంభవుప్రేమపూజలన్
శాణదలిర్పగైకొనెడిరాణి సుపుస్తకపాణి సైకత
శ్రోణి కవీంద్రవాఙ్మయ సుశోభితవాణి ప్రసన్న మయ్యెడిన్

సర్వవిధంబులన్ జనులశక్తికినిం దగు పూజలంది తా
నుర్వి సమస్తకాలముల నొప్పగ విఘ్నమహాంధకారపున్
గర్వము గూలనేసి కలకాలము దివ్యశుభంబు లిచ్చు నా
పార్వతి బిడ్డ మమ్మతికృపాపరతంత్రత మించుగావుతన్

రామునిపంపునన్ సమదరావణ గర్వము రూపుమాపి శ్రీ
రామపదారవిందముల లక్ష్యముగా గొని భక్తితోడ సీ
తామృదులాంగికిన్ నిరతదారుణదానవబాధ దీర్చు నా
కామవికారదూరగుఁడు గాచుత సత్కపివీరుఁ డెప్పుడున్

అవిరళభక్తితత్పరత నంజలిఁ జేసెద సూరిహృద్యమా
కవిత జగత్ప్రసిద్ధి గలుగంగ సమంచిత భావవైభవో
ద్భవరసపూర్ణతన్ గృతుల దక్షతఁ దా రచియించి మించుచోఁ
గవికులశేఖరుం డనగ ఖ్యాతి వహించిన కాళిదాసునిన్

# సత్కవి ప్రార్థన

ఆంధ్రసాహిత్యనందనోద్యానవనిని
సరస కలగాన దివ్యమాధురుల చేత
సతము నవ్యవసంత శోభిత నొనర్చు
నాది కవికోకిలమ్ము నే నభినుతింతు

కమ్మని తేట తెన్గు నుడికారపుసొంపు పదమ్ములందు భా
వమ్ములయందు హైందవము భాసిలు పొందిక సందడింప మో
దమ్మున పంచమశ్రుతి పదమ్ముగ సన్మతి సమ్మతించు కా
వ్యమ్ములు సంతరించిన మహాకవిఁ దిక్కన నెంతు నెమ్మదిన్

సముచిత శబ్దరమ్యత ప్రసన్న కథాకవితార్థయుక్తి వ
ర్ణముల ననల్పభావరచనావిధ మద్భుత శిల్పశక్తులన్
గ్రమమున భాసిలంగ ఘనకావ్య వినిర్మితి సల్పినట్టి త
త్ర్యముఖ యశోవిలాసుని ప్రబంధమహేశుని సన్నుతించెదన్

కవితారాధకులై కళావిదితులై కల్యాణ సంధాతలై
వివిధానల్పవధాన దివ్యకలనా విస్ఫారసంపన్నులై
స్తవనీయ ప్రథిత ప్రబంధ రచనా చాతుర్య మాధుర్యులై
భువనంబందునఁ దిర్పతిద్విజులు మెప్పు ల్గాంతుర శ్రాంతమున్

శ్రీ గురుభ్యోనమః

శ్రీరాఘవ నారాయణు
సారాచారాభిరాము సతతము మదిలో
నారాధించెద కవికం
ఠీరవు ధీరాగ్రణిన్ గుణిన్ మద్గురునిన్

సర్వకళావిశారదుఁడు శాంతుఁడు దాంతుఁడు
సంయమీంద్రుఁడున్
గర్వవిదూరుఁ డభ్యుదయకాంతి పథప్రసరుండు మద్గురుం
డుర్వి సమస్త శాస్త్రముల కున్నతపీఠి, సదర్థపేటి, జ్యో
తిర్విదుఁ డధ్వరప్రియుఁడు దివ్యతపోమహిమాత్ముఁ డెంతయున్

భూసురలోక బంధువయి, భూరిజనంబులు భక్తి సంతతో
పాసన గొల్వగా సరసభావపరీమళ కావ్యపుష్పముల్
చేసి రసజ్ఞు లందఱ విశేషముగా నలరించునట్టి ప్ర
జ్ఞా సముపేతు నే నధిక సన్మతితోడ భజింతు నిత్యమున్

తెలియని విద్య లేదు జగతిన్ బయనించని తావు లేదు వ
త్సలుఁడని శిష్యు లెల్లెడ ప్రశంసలు సేయనివారు లేరు త
జ్ఞులు ఘనమార్గదర్శకులు సూరి జనంబులకెల్ల నొజ్జయం
చల మునిమాన్య మద్గురు గుణాలయు నెన్ననివారు లేరిలన్

సంతత సత్యభాషణుఁడు సాధుజనాదరణుం డచంచల
స్వాంతుఁ డగణ్యపుణ్య చయసంచిత సత్ప్రతిభాభిరాముఁ డ
త్యంత ముదారశీలుఁడు సుధామయసూక్తి నిధీశ్వరుండు మా
కాంతపదారవిందము లకల్మషభక్తి భజించువాఁ డెదన్

చేసితి పెక్కుకాలము విశేషవిధానఁ దపంబు లెన్నియో
పాసితి వ్యర్థజీవితపుబాట విచక్షణ ధర్మదృష్టిలో
భాసిలజేసి దివ్యఋషిభావ మెలర్పగ శిష్యకోటికిన్
వాసిగ బోధఁ జేసితి కృపన్ మహితాద్భుత మంత్రతంత్రముల్

శ్రీ ఆంజనేయాయనమః

# పావనీ శతకము

1. శ్రీ కల్యాణగుణార్ణవుండు త్రిజగత్సేవ్యుండు భక్తార్తర
క్షా కారుణ్య విరాజితుండు, కవిదోషధ్వంసకుం, డార్షధ
ర్మైకాయత్త సువృత్త చిత్తుఁడు
సహాయప్రక్రమోద్దండుఁ డ
స్తోకప్రాభవశాలి రాఘవుని భక్తింగొల్తు నో పావనీ!

2. భారం బంతయు నీదె లే దొకటి యున్
భావంబు నా కెందు నిఁ
జేరన్ వేడెద భక్తిమార్గమున నీ చింతాసముద్రంబునన్
నేరంజాలఁ జరింప, మోహతిమిరానీకంబుఁ బోఁ జేసి సం
సారంబందుఁ దొలంగఁ జేయుము మనస్తాపంబులన్ బావనీ!

3. తలతుం బీఠిక, నర్ఘ్యపాద్యవిధులం దానంబుఁ జేకూర్చి వేఁ
గలపంబుల్ మెయి బూసి వస్త్రయుగమున్
గై సేసి పూజింతు నిఁ
ఫలపత్రంబులఁ బుష్పదామముల దివ్యాంభః ప్రదానంబులన్
గలమాన్నంబులు పంచభక్ష్యములు నీకై యిత్తు నో పావనీ!

4. గురుఁడున్ దైవము,తల్లి దండ్రులును నాకున్నీవ వేమేల నే
నొరులన్ వేడెడువాఁడ గాను
మదిలో నూహింపుమో స్వామి నీ
చరణంబుల్ మది నమ్మి నిన్నె సతమున్
సాహిత్యపుష్పాళితోఁ
బరిపూజించెద విద్య లిచ్చి కరుణన్ బాలింపవే పావనీ!

5. నిపుణి న్నిర్భయు, నిశ్చలు న్నభయపాణిన్, రామనామైక భా
వ పవిత్రున్ నిగమార్థవేద్యచరితుం బాండిత్యపారీణు యో
గపిపాసున్ భవపాశనాశన కళాకౌశల్యు నాధార భూ
తపదాబ్జున్ నిను గొల్తుఁ గావగదె సద్భావంబునన్ బావనీ!

6. నిను ధ్యానింపనిచో క్షణంబు యుగమా
నీనామమున్ సంస్మరిం
పనిచో భాష నిరర్థకంబగు భవత్పాదాబ్జ సంసేవ చే
యనిచో జన్మము నిష్ఫలంబగు ననిత్యం బీభవం బేల ద
ర్శన భాగ్యంబున ధన్యుగా సలుపు మారాధింతునిన్ బావనీ!

7. వేదాభ్యాసమొ, మంత్రతంత్ర మహిమావిష్కారసంపత్తియో
ప్రాదుర్భూత విశేషశాస్త్రకవిత ప్రజ్ఞాప్రభావంబొ యో
గాదిస్తోమమొ నే నెఱుంగ నిటు లుగ్రాకారసంసార మే
నీదంజాలఁ దరింపఁజేయఁగదవే ఈశస్తుతా పావనీ!

8. దేవా! నా దొక విన్నపంబు వినుమా దీనావనాఖ్యుండ వీ
వేవేళన్ సుఖశాంతిసంపదల నెంతే గూర్చి కాపాడుమా
ఆవీ లిప్పుడు లేనిచో సతతయోగాభ్యాసనిష్ఠన్ ద్వదీ
యా వాసంబు నొసంగు మీ జగతి భవ్యాసంగతిం బావనీ!

9. అపశబ్దం బను దోషముం తెలుగఁ బో
నాచార్యశిష్యుండనై
యుపమాలంకృతిరీతి పాకముల నే నూహింపఁగాఁ జాలఁగా
వ్యపథంబందు విశిష్టమైన రచనావ్యాపార మెట్లబ్బు నీ
కృప నాకీయెడ లేనిచో వినుతకీర్తిప్రాభవా! పావనీ!

10. అణిమాద్యష్ట విభూతులున్నను విలాసైకస్వభావంబు లే
దణుమాత్రంబు, విశేషసత్త్వ
సముదాయంబుండియున్ గర్వధో
రణి కన్పట్టదు సర్వశాస్త్ర పరిపూర్ణ జ్ఞానసంపత్తి భూ
షణమయ్యుం బరదూషణం బెఱుఁగ
వీశా! మత్ప్రభూ! పావనీ!

11. జాగ్రద్బోధమునందు సర్వకరణాస్థల్ నీపయిం జేర్తు స్వ
ప్నగ్రామంబున నీపవిత్రకథలన్ భావింపగా నెంతు నే
కాగ్రధ్యానశ్రుతిన్ సుషుప్తి భవదైక్యం
బిమ్ము దేవా! సదా
నుగ్రాహ్యుండను విస్మరింపకుము ని న్బూజింతు నో పావనీ!

12. పతనంబన్నది లేదు సి న్గొలుచు సద్భక్తాళి కెందేనిఁ దా
మితరాపేక్షలు మాని సర్వమును నీవే
యంచు లో నమ్మి సం
తత దుఃఖంబులఁ బాసి యిష్టఫలసంతానంబులం దృప్తులై
వ్రతనిష్ఠన్ భజియించుచుంద్రు కరుణావారాన్నిధీ పావనీ!

13. శతక మ్మొక్కటి వ్రాసి యిత్తునని మున్ స్వాంతంబునన్
మ్రొక్కనీ
వతి కారుణ్యముతోడ నుత్సుకుడవై యాశీస్సు లందించి స
మ్మతిజూపించితి వౌర! సారకవితామాధుర్యధుర్యుండగాన్
మతి నిన్నే దలపించుకొ మ్మెపుడు సన్మానంబున న్పావనీ!

14. ధనకాంక్షం బరికింపఁబోను కుజనుల్ ధర్మంబు నేరీతి నై
నను వా రర్థముఁ బ్రోవుసేయుచు కడున్ న్యాయంబుగా
నెంతు రో
ప్పును దప్పుం గడవెట్టి యిష్టవిధులన్ భోగంబులం దేలి యెం
దును నిన్నుం దలపోయలేను కలిలో దుర్మార్గులై పావనీ!

15. జగతి న్నీతినశించె భీతియును నష్టంబయ్యె జాత్యైక్యబు
ద్ధి గతించెన్ బరపీడనం బధికరీతిఁ సాగె నాశాపిశా
చగణంబుల్ ద్రవిణామిషాశ దివిరెన్ స్వాతంత్ర్యాశక్తుల్ త్య
జింపగ యత్నించిరి స్వార్థపోషణరతిభ్రాంతాత్ములై పావనీ!

16. ఘనమా శ్రీరఘురామనామ జపముం గావించి మోక్షైకభా
వన నిస్సంగుఁడవై జరామరణముల్ బాధింపరానట్టి జీ
వనమార్గంబున భక్తబృందములకున్ భావ్యుండవై మోహవా
రినిధిం దాటగ నావ వౌదువు మదార్తిం బాపుమో పావనీ

17. అభయం బిచ్చి విభీషణాదుల సమస్తైశ్వర్యముల్ గూర్చు నీ
శుభసందాయకమైన సద్గుణములన్ స్తోత్రంబులఁ గూర్చువా
ని భవంబుల్ వెసఁ దర్చి ప్రోతువని ము న్నీనామసంకీర్తనల్
విభవం బొప్పగ సల్పువాఁడ దయతో వీక్షింపుమో పావనీ!

18. స్వామీ! ఏమి ననుం బరీక్షసలుపన్ సంకల్పముం బూనితే
సామాన్యుండను నీదు నామభజనాసక్తుండ న న్నీగతిన్
నేమింతే శరణాగతార్తిహరణా! నీపాదసంసేవగా
కేమీ కోరినవాఁడ గాను కృపతో నిప్పింపుమో పావనీ!

19. కలనైనన్ మనసార బల్కు చెలుఁగంగా నేరఁడే నాఁడు నీ
వల కొక్కింతసహాయముల్ సలుపఁ డార్తత్రాణమున్
జేయఁగాఁ
దలపోయం డసమర్థశీలి మన యర్థప్రాణముల్ నిక్కమై
యలరారంగల వన్న స్వార్థమతితో నశ్రాంతమున్ బావనీ!

20. బలవంతుం గని యోర్వజాలఁ డెవ దంభప్రాయమౌ పల్కులే
పలుకు న్గర్ణకఠోర మౌ నటుల నుత్పాదించు నిందార్థముల్
కలహించుం దిలకించు తంపులిడి, బింకంబూనుఁ దుచ్ఛుండుదా
నిలువెల్లన్ విషమంద్రు కుత్సితులకున్ నిక్కంబె సూ! పావనీ!

21. వ్యామోహంబున భూమి నాయకులె యన్యాయంబు
సేయంగ నా
యామంత్రుల్ ప్రజలాస్తిపాస్తులనె యూహారింప నుద్యోగు
లెంతే మర్మంబున లంచగొండులయి వేధింపఁగ విదేశీభ్రమ
స్థేమన్ భద్రములం ద్యజించిరి ప్రజల్ తీండ్రంబునన్ బావనీ!

22. ఆధివ్యాధులు చుట్టుముట్టి యొకటై యంతర్బహిశ్శత్రువుల్
వేధింపన్ స్థిరసౌఖ్య మన్నిటను లోపింపంగ జీవాత్ముఁ డీ
హాధీనస్థితి దుఃఖియై విడువలేఁ డా దుష్టసంసార మీ
బాధాగాథల మాన్పి మోక్ష మిడి సంబాళింపవే పావనీ!

23. కురుసేనల్ నలుమూలలం గదియుచున్ క్రోధోగ్రభావం
బునన్
నరుతో నైకవిధాస్త్ర సంచయ బలోన్మాదంబునం దాకసం
గరరంగంబునఁ గ్రీడికన్ రిపులమూకల్ చీల్చి చెండాడగా
నుకుశక్తిం గలిగింపనై ధ్వజమునం దున్నావుగా పావనీ!

24. ప్రత్యాఖ్యానము సేయఁగా సగుణ నీ భాస్వత్సదాచారస
న్నృత్యద్భాసితయోగవిద్య మహిమన్ భాషాప్రవీణుండనై
సత్యౌదార్యగుణావలంబనమతీ! సౌభాగ్యయోగ్యామ లా
ద్ధత్యప్రాపితకీర్తిసాంద్ర! జగదాధారా! ప్రభూ! పావనీ !

25. వత్సా! రమ్మని చేరఁబిల్చి మదిలో వాత్సల్యమేపార సం
పత్సిద్ధిం గన దీవనల్ సలుపుమా! ప్రార్థింతు నిన్నిప్పుడున్
మత్సాన్నిధ్యమునన్ వసింపుము క్రుధామాత్సర్యముల్
మాన్పు నీ
సత్సాంగత్య మొసఁగ వేడెదనయా! స్వాంతంబునం బావనీ

26. అంతశ్శత్రువులున్ నశింప మనముఁ స్వాధీనమైయుండ స
ర్వాంతర్యామి నతీతలౌకికదృశావ్యాపారరూపేతు ని
న్నెంతే భక్తి నుతింతు దివ్యమహిమాధీశా! కృపాబుద్ధి న
న్నంతేవాసిగఁ గైకొనంగ నగునయ్యా! కూర్మి నో పావనీ!

27. భవపాశంబుల బట్టి యీడ్చుదిశకుఁ బద్ధుండనై యుందునో
భవదంఘ్రిద్వయసేవ సేయఁగ తరింపంజేసెదో చెన్నునై
కవిధంబుల్ కవితాకలాపముల సంకల్పింతు నిప్పింపుము
య్యవధానప్రతిభా ప్రభావముల సమ్యగ్రీతిగఁ బావనీ!

28. తలిదండ్రుల్ సుఖపెట్టలేదనుచు నిత్యంబున్ విమర్శింతు ర
జ్ఞులు దాఁజేసిన పూర్వపుణ్యమునకెచ్చో నంతకలతే ముఖా
న లిఖించున్ ఫలమావిధాత గతజన్మంబందు ప్రారబ్ధమిం
దులభించున్ మరి త్యాగమే ప్రజలకున్ భోగంబునౌ పావనీ!

29. సాక్షీభూతు నతీంద్రియార్థ సుమన స్సంతాప సంహార దీ
క్షాదక్షు శంకర రక్షణాక్షణ చణోత్కృష్టాపూర్ణ కారుణ్యాది
వ్యక్తీరాంబుధిఁ బవ్వళించెడు ఘనశ్యామాంగు బృందారకా
ధ్యక్షుల్ గొల్చితివయ్యా! తత్సకల చర్యాపూర్వ్యహా! పావనీ!

30. కవితాశక్తి ననేక కావ్యముల నక్కాఱించినన్ వేదశా
స్త్రవిధుల్ మెండుగ దానధర్మముల నంతస్శుద్ధిఁ గావించినన్
భవబంధంబులు తప్పఁ బో వెవరికిన్ వాంఛించి నీ నామసం
భవ దివ్యామృతసక్త చిత్తు లయి సంభావింపకో పావనీ!

51. స్థిరసంకల్పము కార్యదీక్ష, ఫలసంసిద్ధిం బ్రసాదింపు మో
వరదా! సర్వజగచ్ఛరణ్యా! సుగుణవ్యాసక్త! నీయందు భ
క్తిరసావిష్టత గొల్చువానికిని భుక్తిన్ ముక్తిఁ గల్పింతు వా
దర భావంబున దేవదేవ! జగదాధారుండవై పావనీ!

32. భవదంఘ్రిద్వయిఁబూజచేసెడు మహాభాగ్యంబునిప్పింపుమో
భువనత్రాత! జగద్విధాతః సుగుణాంభోరాశి! మద్దేశిక
ప్రవరా! దైన్యవిహీన జీవితము నిష్పాప ప్రవృత్తిన్ సద
ర్థ వివేకంబు ప్రతిష్ఠ సేయుము మదారాధ్యుండవై పావనీ

33. అనయంబున్ వినయంబుమీర నిను నేనర్థింతు సర్వేశ!నా
మనవిం గారుణికత్వ మేర్పడ గ్రహింపం జూడవే పేర్మితో
ఘనవిక్రాంతి విదీర్ణ వీరదితిజా! కామాది షడ్విడ్రిపూ
నను నీపాదనలద్వయార్చన రతున్గా జేయుమో పావనీ!

34. అల సుగ్రీవుని మంత్రివై సుమతివై యార్యప్రకీర్తిప్రభా
విలసన్మానిత మార్గవర్తివయి సంసేవ్యాగమార్థ స్వరూ
ప లసద్భావిత భావనైభవుఁడవై వైరాగ్య సంప్రాప్తమో
క్షలతావేల్లితరీతిఁ బొల్చు నిను నాశంసింతు నో పావనీ!

35. ఘనునిన్ వ్యాకరణాది శాస్త్రవిదుని న్గల్యాణసంధాయకుం
గన దంగున్ రఘురామనామజపదీక్షాసక్తు, దుర్వార శ
క్తి నిపీతాఖిల వైరివీర జలధిం గీర్త్యబ్ధు సద్ధర్మ జీ
వన సంపత్కర పాదపద్మ నిను సంభావింతు నో పావనీ!

36. స్థిత తేజోధిక ధైర్యసాహసగుణశ్రీ భాసితోత్సాహ సా
ధిత లంకాపురి రాక్షసాధమ చమూ తేజా! మహౌదార్య ర
క్షిత సంసార నిమగ్న భక్తజన! సాక్షీభూత భూతాంతరం
గ తమోవారణ! మోక్షసత్ఫల దదత్కల్పద్రుమా పావనీ!

37. ఖిలమయ్యెన్ మదవిజ్ఞతా జనిత మత్క్షీణాత్మ గర్వంబు కే
వలముఁ దుఃఖమయంబు సంసరణమే భావించి యిన్నాళ్లు ని
శ్చలబుద్ధిన్ బరతత్త్వముం దెలియగా శక్తుండగా నైతి నా
దలఁ దాల్తుఁ భవ దంఘ్రిపద్మముల సత్యంబింతయుం బావనీ

38. ద్రుత భావంబున నెన్ని యేని దోసఁగుల్ తొల్లెప్పుడై నంబొన
ర్చితి నేనిం గను, వాని నన్నిటి మఱిం జింతింపఁగాఁ బోకు భూ
రి తపోవైభవ సర్వమృత్యుభయహారీ నామపారాయణ
వ్రతశీలుండను మన్ననల్ సలువవే వాక్రుచ్చెద న్బావనీ!

39. పరమోత్సాహుండవై మనో జవమునన్ పాథోనిధిం
దాటి దు
స్తర బాహాద్వయశక్తి లంకిణీ మదాంధత్వంబు విచ్ఛిన్నమై
పరగంగా నని నోర్చి వహ్నిం దరికొల్పం జేసి లంకాపురిం
ధరణీకన్యకజాడ తెల్పితివి మోదంబొప్పగన్ పావనీ!

40. బుధసంసేవయు దివ్యకావ్యపఠనంబుల్ సాధుసంఘంబుగూ
డి దయా ధర్మ విశేషముల్ తెలియ నేతేవల్ దురా
చారముల్
తుదముట్టింపంగ పట్టుబట్టి జగతిన్ దుశ్శాస్త్రులం బారద్రో
లం దగం దేజము మాకు నీయంగదె! యేలా చాలమో
పావనీ!

41. తగవా! జీవికి జీవి జీవన మగున్ ధర్మంబు లోకేశుండే
మిగతిన్ నిర్మితిం జేసె సృష్టి నిలలో మిత్రత్వమే లేదు లో
భగుణం బెక్కుడుం జంపజూతు రొరులన్ భావింపంగా
లేరు తా
ము గతింపంగల వారమంచు నిదియే మూఢత్వమో పావనీ!

42 సదతిప్రాభవయుక్త మాన్యగుణ సంజాత ప్రమోదైకయో
గ్య ధనాగారు జితేంద్రియప్రకరు, లంకాధీశ గర్వాంధ వా
రిద పంక్తిన్ విదళించు వాయువు బలారిన్ బోలు సంపద్విభా
సదను ద్దీనజనావనవ్రత హితుం జర్చింతు నిన్ బావనీ!

43. పదవీకాంక్ష నశేష ధర్మపథ సంప్రాప్త ప్రకాశంబు నె
మ్మది భావింపక ఘోరకృత్యముల నామప్రాభవార్థైక స
మ్మదులై నీతివిదూరులై కృపణులై మార్గాంతరానీత స
న్నదులై బోధకళావిహీనమతులైనా రేలకో పావనీ!

44. జన సత్త్వంబుల గూర్చు శౌర్యఖని, నాశాభూత నిర్మూలనో
త్సన నిర్వాహకు, నిర్విరామ జపసంధానైక సంతృప్తు సా
ధుజనరేణ్యు సదసద్వివేకచతురుఁ దోర్వీర్యదుర్ధర్షు దా
నవసంహారు నరాతిభంజను నిను న్భావించెదం బావనీ!

45. సుజనాధార పదారవిందు, బుధ సంస్తుత్యాక్ష ధర్మప్రియుఁ
భుజదుర్వార పరాక్రమక్రమ కళామోదాశ్రితానేక భ
క్తజనోపాత్త విశేషకీర్తిభవనుం దాపత్రయాగ్నిప్రభల్
నిజ సందీప్తి నడంచు భానుని మది న్నిన్గొల్తు నో పావనీ!

46. జగదాశ్చర్య తపోబలార్చిత మహాసౌజన్య సంధాన మో
ద గరిష్ఠుఁ వివిధాధ్వరాత్త ఫలసంధాయుఁ బ్రతా
పోన్నతుల్
సుగుణాకారు వికారదూరు, వరతేజోరాజితుఁ సర్వదే
వగణ స్తుత్యుని నిన్నె గొల్చనను బ్రోవంజూడవే పావనీ!

47. ప్రతినల్ సేయుట సాధ్యమే యగును గొప్పం గోరి
యవ్వాని స
న్మతిఁ దీర్పం గడుకష్ట మేర్పడు సుధామాధుర్యపుం బల్కులే
లో తదాగంభదర్శఁ వచింతురదియేదో లాభమాశించిన్యూ
నతెఱఁగా నంచు నెఱుంగ రేమి కుమతుల్ నానాటికిం బావనీ

48. ధనమే మూలము శత్రుమిత్రములకుఁ దాసం బ్రలోభంబు
నం దసి వారెవ్వరు లేరు ధీరమతులై తత్సాధనోద్యోగ మం
దున బాటింపరు సర్వశాస్త్రవిధులం దుర్వృత్తి యేపార స
జ్జన పీడాకర కార్యకారణ వృథాసంరంభులై పావనీ!

49. లంగోటీ బిగియించి యుద్ధమునకున్ లంఘించి మార్కొన్న సే
నం గ్రూరంబుగఁ జీల్చి చెండితి రిపుల్ నాశంబుఁ జెందంగ భ
క్తిం గేల్మోడ్చి భజించినం గరుణతోఁ గీర్త్యాది సౌఖ్యంబు
లెల్లం గల్పించితి ధీరదానగుణ సుశ్లాఘ్యుండవై పావనీ!

50. పాపారణ్య దవానలంబును, జరద్ధ్వాంత ప్రదీపమ్ము నా
శా పాశాసి, రుజాబ్ధి తారిక, మహాసంసార మోహారి యో
యాపద్బాంధవ! గ్రంథివారకము జంత్వాత్మవ్యథానాశమౌ
నీ పాదాంబుజసేవ లిచ్చుత ఫలానీకంబులన్ పావనీ!

51. గద చేపట్టి ప్రతాపతాప మెనయంగా వైరికామాంధకా
రదరిద్రుల్ బొలియించి స్వామిహిత కార్యం బెల్లఁ జేకూర్చిన
మ్మ్ముద మొప్పన్ జగ దంతరాళమున వ్యామోహంబుఁ
బోఁజేసి ధ
ర్మ దయా శౌచములం జరించితి మహామాన్యుండ వో
పావనీ!

52. అనుమానంబు భరించి పౌరుషము బోనాడంగ నేర్పయ్యెనీ
యవనిన్ మానవజాతి కిట్టి కలుషంబౌ జీవనం బిచ్చె నే
మొ విధాతృండు యెఱుంగరావుగద స్వాముల్ సేయు
కార్యంబు త
ష్ఠవకాశంబునుఁ బట్టి పల్కుటలె నేఁ డాచారమా పావనీ!

53. సతియంచున్ సుతులంచు బంధుతతుల న్సంసారముం బెంచి
నిందితునిం జేయఁగ నేల? వ్యర్థమమతన్ దేవా! దయా
సాగరా!
సతతంబున్ భవ దంఘ్రిసేవయె మహాసామ్రాజ్యసంపత్తిగా
మతి నెంతున్ భవబంధముక్తి నొనరింపం బూనుమా పావనీ

54. సత్యంబన్నది శూన్యమాయె జగతిన్ స్వార్థంబవ్యాపించెడిన్
నిత్యానిత్య విచక్షణల్ విడిచి పల్ నేరంబులే చేయఁ బా
మత్యాయత్తత ప్రాకులాడెదర దేమాశ్చర్యమో. స్వామి నీ
భృత్యున్నన్నుఁ ద్వదైక భావనుని గావింపంగదే పావనీ!

55. తనఖా పెట్టిన యాస్తి మొత్త మెటులో తామే గొనం
దుష్టమో
జన వడ్డీలని వ్రాతకోతలనుచున్ సర్వంబునున్ మ్రింగి చే
సిన తప్పుల్ క్షమియించి మాకు దయతో సేమంబుగల్గింపు నీ
కు వనేకంబులు లంచ మిత్తుమనుచుం గోర్కొందురో పావనీ!

56. సతియా జానకి మున్ను రావణునిచే సాన్నిధ్యముం గోలుపో
నతి దీనాకులచిత్తుఁడై యడవిలో నాలాపముల్ సేయుచున్
వెతలం బొందెడు రామునిన్ సఖునిగా వీక్షించి తోడ్పడ్డ స
న్మతిఁ గాపాడవె నన్నుఁ గావ్యరచనా మార్గంబునన్ బావనీ!

57. తరమా నిన్ను నుతింప నాకు కవితాధారాను పద్యావళిన్
గరుణానీరధి! దీనబాంధవ! మదాకాంక్షాళి నైకంబుఁగా
ధరపై నింద్రియ వాంఛ పర్వులిడగా ధ్యానింపగా లేను లో
వరలం జూడుము నిన్నె గొల్వనగు భావంబుల్ సదా పావనీ!

58. శివునంశన్ జనియించి రాముపదముల్ సేవించి యద్వైత త
త్వవిచారంబునఁ బండితోత్తములకున్ వాదోపవాదాళిమా
న్పి విశిష్టంబగు బోధసల్పితి మహావేదాంతివై దాంతివై
స్తవనీయప్రియ! సచ్చరిత్రుఁడ నినుం దర్శింతునో పావనీ!

59. బలగర్వంబునఁ గన్నుగానక వృథా పంతంబులం బల్కుయు
జ్జ్వల శక్తిప్రకరున్నినుం గదిసి తేజస్స్ఫూర్తిఁ గోల్పోయిసి
3)

గ్గలి ప్రార్థింప విరోధిసైన్యముద్భటిం గెల్వంగ శౌర్యంబు సం
ధించిన క్లీవు పృథా తనూజు దయతో దీవింపవే పావనీ!

60. అనవద్యంబును హృద్యమై సకల విద్యాప్రాప్తి సౌశబ్ద సా
ధన ఛందోమయ నవ్యభావ కవితాదక్షత్వ మింపారగా
విన శ్రావ్యంబులుఁ జూడముచ్చటలునై వేమారు నానందను
గ్నని జేయంగల కావ్య నాటకములం గుర్తింపరే పావనీ!

61. వనితామోహితులై జరామరణ సంభారంబునా జీవితం
బు నెనిత్యంబని యాశఁజెంది నిరతంబున్ సత్యమార్గాన్వయం
బునఁ దత్త్వం బెఱుగంగజాలక జగంబుల్ మేమె సృష్టించినా
మని గుండెల్ తెగబాదు కొంద్రు తగునయ్యా బీరముల్
పావనీ!

62. ఒకనాఁడేని రఘుప్రవీరు చరితం బూహింప క్లేశాపనో
ది కృపాపాంగ వసుంధరాతనయ సత్కీర్తిం ప్రశంసింప స
త్యకథా భాషణు నింద్రజిద్రిపు సుమిత్రాసూను చారిత్ర మే
నకలంకస్థితి గొల్వ నిల్వ వశముల్ వ్యామోహముల్
పావనీ!

63. ఏనాఁడైనను నిన్ను వేడితినె నా కిమ్మంచు నేదైన చే
వా నీసేవయె భాగ్యమౌ ననుచు నే భావింతు నిక్కంబు నీ
కై నాజీవన పుష్పరాజ మిడి నిన్నర్చింతు విద్యావిశే
షానీకంబు నొసంగుమా భువన వంద్యా పేర్మినో పావనీ!

64. దశకంఠుం దనుజాది రాక్షస కులధ్వంసంబు గావించి దు
ర్దశలం బాపి త్రిలోకవాసులకు వంద్యంబై సదారాధ్యమై
విశదంబైన త్వదీయ కీర్తి కెనయున్ వీక్షింపగా లేదు నీ
కుశలత్వంబున ప్రోవవే విమల మార్గం జేయుచుం బావనీ!

65. మే లందించితి వంగుళీయకము మేల్మిన్ సీతకుం జూపి నీ
వాలాభీల కరాళకాల దహనజ్వాలావళుల్ బేర్చి లీ
లా లాలిత్యముమీఱ నొక్క త్రుటిలో లంకాపురిన్ బూఁడ్కమై
రాలన్ గూర్చితి వౌనుతింప భరమా రా నీక్రియల్ పావనీ

66. కలిదోషాహతి బుద్ధిమందులగుచున్ కర్తవ్యతా మూఢులై
వలపుంగాగిలిలో సుఖానుభవమే ప్రాగల్భ్యమానంచు దాఁ
దలపం జెల్లునె పుట్టి గిట్టుటయె మా తాత్పర్యమం చెంచి జీ
వు లక్ష్యంబును సంచరింప నగునే భోగార్థులై పావనీ!

67. త్రిదశుల్ వాకొనలేరు నీమహిమ నెంతే నిష్టమా నీశ్వరుల్
విదితుం జేయఁగఁ జాలరో సహనధన్వీ! నీస్వరూపంబు భ
క్త దయాళుండవు వేషభాషలకు లోన్గాకుండువాఁడంచు నెం
చెద తండ్రీ నను గావుమయ్య కరుణాసింధుండవై పావనీ!

68. దురహంకార మదంబు లెచ్చులెసఁగం దుశ్శాసనాధిక్యసం
భరితారంభ విజృంభమాణ కలికల్ప ప్రోక్త ధర్మంబునన్
నిరసింపం దగు నే సనాతన విధి న్నిస్తబ్ధమా నంచు ము
మ్మర మైనట్టి వితండవాదసరణి న్మల్లాడుచుం బావనీ!

69. సకలాభీష్టము లిత్తు వీ వని యశేష స్ఫీత పూజా విధి
న్నకలంకంబగు భక్తితత్పరత నిన్నారాధనల్ జేసెదన్
బకవిధ్వంసిసహోదరా! దురిత సంబంధంబుఁ బోనాడ నా
కిఁక నీవా చరణంబులే శరణమం చెంచితిం బావనీ!

70. భువనాభ్యర్ణ వికీర్ణ సంతత తమః పూరప్రహాణ్యాత్త కాం
తి విశేషోదిత బాలభానుని వలె న్దివ్యర్షివై జ్ఞానసాం

ద్ర వినూత్నోజ్వల దీధితుల్ వెలయుం జింతాభగ్న
సంసారమ
గ్న విచారంబునుం ద్రోల్గఁజేయుదు వుదగ్రప్రాభవా పావనీ!

71. మదమాతంగము దానసౌరభము సమ్మానింప నేఁగెంచుతు
మ్మెద ఝుంకారనినాదముల్ వినుచు నాక్రమించు
గర్వంబునన్
పదశక్తిన్ ఫలపుష్ప పత్రభర సంభావ్యంబు నుద్యాన సం
పద నెల్లం దుద ముట్ట ధ్వంస మొనరింపం జెల్లునే పావనీ!

72. బలము న్గౌశలమున్ యశోధనము సంపత్సిద్ధి కల్పించు వి
ద్యలసారంబు విశేషధైర్య మహిమం బారోగ్యము
ద్యోగ ము
జ్వల వాక్ప్రౌఢి నొసంగు నీచరణ కంజాతంబు లెల్లప్డు ని
శ్చలభక్తిం భజియించువారల కవశ్యం బెన్నగా పావనీ!

73. నిరుపేదల్ తమిఁద్రావ గంజికఱవై నిశ్చేష్టులై యూర్చుచున్
భరమౌ కష్టపరంపరం జకితులై ప్రాణంబులేపాయ మ
త్సరబుద్ధిం దమవేయటంచు సిరులన్ స్నానంబుఁజేయంగ నే
ర్చిరి సంప ద్విభవాతిగర్వితమతుల్ శ్రీమంతులో పావనీ!

74. తమకార్యంబు కృతార్థతం బరగ సత్కారంబుగావించు ద్వ
త్సము లెవ్వారును లేరటంచు బొగడన్ దత్సాధనానంతర
మ్మును భావంబున లెక్కజేయఁడు ఫలంబున్ దన్ను జేరంగ ధ
ర్మమె యోజింపఁగఁ బోవడేమి యిది కార్తఘ్న్యంబొకో
పావనీ !

75. కనకోరత్నముఁద్రోసి గాజుపలుకుల్ గైకొన్న చందాన యో
జన సేయందగు బుద్ధిమాని జడుడై సాహిత్యసంవేద్యపా

ననమూర్తిం గనలేక నన్యగతులై ప్రారబ్ధకర్మంబులన్
దన సర్వస్వము ధారవోసి తిరుగుం దాదాత్మ్యతం బావనీ!

76.యమము న్నియమముమీఱఁగా నిను నవశ్యంబున్ జపింపంగ
సంతమసాంధంబునశించి జ్ఞానయుత విద్యాసంప దుద్భాసమా
న మహత్వంబున సత్యమార్గగతి మాన్యత్వంబు ప్రాపించి ని
ర్మమతాహంకృతి తానయై యిహపరప్రాప్యుండునౌ పావనీ!

77.మృతసంజీవనిఁ దెచ్చి వైరిబలమున్ భేదించి సంగ్రామమూ
ర్ఛితు సౌమిత్రిఁ బునఃప్రబోధితునిగా సేమంబు కల్పించి శ
త్రుతమంబున్ సమయింపఁ జేసితివి ప్రాదుర్భూత మానంద
మున్నతి గల్పించితి రామచంద్రునకు నెన్నం బ్రోడవే పావనీ!

78.శ్రీరామప్రభుభక్త! భక్తజన హృత్త్పేమాశయా! ఆశయా
పూరా! శోకవినాశ! నాశితరిపుప్రోత్సాహ! ప్రోత్సాహదో
స్సారజ్ఞాపిత! జ్ఞాపితాగ్ర గురుశాస్త్ర శాస్త్రతత్త్వజ్ఞఃఓం
కారాకార! వికారదూర! సుమనస్కా! పావనా! పావనీ!

79.కలగే నా కిల సాటి వా ర నెడిపీకం బూని విద్వద్వరే
ణ్యుల దూషించుట నైజమౌమె నొకని న్భాషింప
వేరొక్క రెం
డులకో యీర్ష్యవహింతు రెట్టులయిన న్దుర్యోగముల్ సేయఁ సి
ద్ధులుగా నాదురు బుద్ధిహీనులనఁ గాదో వీరలం బావనీ!

80.అధికారంబున మత్తులై జడులు మాయామర్మముల్
సేయుచున్
విధినిర్వర్తనమందు మందగతులై పేరాసఁ బీడింత్రు స
త్పథులన్ వారినిఁజూడ దుఃఖమగు, నేతాదృక్షు మజ్ఞానమె
వ్వ్యాధి దాని న్విడనాడఁ ద్రోవ నిడరావే మ్రొక్కెదన్ పావనీ

81.అతి ఘోరంబుగఁ జేయు పాప మది యన్యాయంపు వర్ధిబలెన్
బ్రతి లేనట్టి ఫలంబునిచ్చు బరమార్థంబందు శిక్షించు స
న్మతిఁ దాఁ జేసిన తప్పు నొప్పుకొనినం బాపంబు కర్పూరపుం
గతి సర్వంబు తనంత దాఁ గరఁగు శక్రప్రస్తుతా పావనీ!

82.కవితాశక్తి మహాగ్నిఁ బూట సుజనుల్ కల్యాణ సాహిత్యర్తి
తి వెలుంగన్ రచియింత్రు కావ్యవితతుల్ ధీయుక్తి పెంపార
జాతి వినాశంబును బ్రోత్సహింత్రు కుకవుల్ దేనిం గ్రహిం
పంగ నా
నా విచారింపక దుష్టమార్గ గతు లౌచున్నా రయో పావనీ

83.సతతానేక వినాశ కార్యములకున్ స్థానంబులౌ దుర్జనుల్
వితతాయుష్యవిలాసులైన నగుతే న్నేడట్టి లాభంబునుర్
హతపాపౌఘులు సజ్జనుల్ భువనసంఘానంద సంధాయకుల్
కృతకృత్యంబగు వారి జన్మముగదా కీర్త్యర్హ పూ పావనీ

84.ఉత్సాహం బను మాట లేదు మదిలో నూహాపిశాచాలు
తాఁ వత్సారమ్మని చేరఁ దీసి యొడిలో పాలిచ్చిలాలించి యు
ద్యత్సామర్థ్య మడంచి డించి యితికర్తవ్యత్వమున్మాన్పి యా
పత్సామీప్యము చేర్చె మందమతులం బాలింపవే పావనీ!

85.కథల న్వింటిమి మున్ను రాక్షసుల దుష్కార్యంబు లేవేవో యా
విధులే నేఁడు గనంబడెం జగతిలో విద్వాంసులుంగూడ దు
ర్విధ శీలంబునఁ గన్నుఁగానరు ప్రభూ! వీరాసనాసీన! యీ
ప్రథలన్ మాన్పుము నీవె మున్ దనుజులం భంజింపవే పావనీ!

86.శ్రీ రామాంఘ్రిరజం బహల్యకసువుల్ చేకూరఁగాఁ జేసె నా
హారం బెంగిలి పెట్టిన న్శబరి యోగ్యంబయ్యె మోక్షానకున్

నైనల్ రావణకుంభకర్ణులకు దివ్యత్వంబు సిద్ధించెనో
వీరాగ్రేసర! నీకు బ్రహ్మపదమబ్బెన్ మేలుగాఁ బావనీ!

87. చపలుం డన్యగుణావమాని కలుషస్వాంతుం డహంకారితా
నపరాధంబులె సేయువాఁడు కుటిలవ్యాపారవిద్యావిధా
నపరుం డర్థపిశాచి శాసనబలోన్మత్తుండు లజ్జావిహీ
న పథుండైన ఖలుండ వశ్యము చెడున్ తథ్యంబుగా పావనీ!

88. అణుమాత్రంబు గుణంబు కల్గిన నవశ్యం బీవు కైకొమ్ము స
ద్గుణ తేజా! కలిదోష సంహరణ! మద్ఘోరాఘముల్ మాన్పి కా
రుణికత్వంబున రక్షసేయఁగ సమర్థుం డన్న నీవే యివే
ప్రణతుల్ గైకొను మయ్య సత్కవి జనారాధ్యుండవౌ పావనీ!

89. నీకై జీవనమయ్య జీవతనయా! నీకై కదా కైతలున్
నీ కన్నుంగవ నిల్వ సీమములు నిన్నే పాడఁ గంధర్వనుల్
నీ కప్యానన దర్శనోత్సుకత నా నేత్రంబు లింతేలనో
నీ కేసర్వము నీ వెసర్వము మ్రుతుల్ నీపిల్పులే పావనీ.

90. చలచిత్తుం డతిగర్వి దుర్విధుఁడ సంస్కారుం డహంభావి దు
ర్బలు డర్థాతురుఁ డాత్మవంచకుఁ డవిశ్వాస స్వభావుండపో
హాలపాలయ్యెడు వాఁడ నాదరగుణుం డత్యంత మోహాతురుం
డలస స్వాంతుఁడ శాంతి పాలగును దేవారాధితా పావనీ!

91. పరమాజ్ఞానికి విద్యలిచ్చు సతమున్ భద్రంబు సేకూర్చు సు
స్థిర సౌఖ్యంబులుఁ గల్గఁజేయు విజయశ్రీఁ జేతి కందించు సం
సరణాంబ్ధిన్ వెడలించు సత్యపదవిన్ సంధించుఁ ద్వత్సేవలీ
ధర నీనామ మహత్త్వ మెన్నఁదరమే తాత్రమ్యతీ పావనీ!

92.మహా దానంద వదాన్య శేఖర! మహామాయా ప్రభావంబుచే
నిహా వాంఛా పరిలుబ్ధుఁడైన నరుఁడెంతే మోహవిభ్రాంతిచే
గ్రహియింపం గొఱగాఁడు సత్యపదమర్గ్ఁగైవల్య లక్ష్మీసుఖా
వహ మా నీపద పద్మయుగ్మమును గొల్వం బోనిచో పావనీ

93.చింతాకంతయు చింత లేదు మది వాసిం గోరఁ డజ్ఞానపుం
బంతం బొక్కటి దక్క మేలయిన త్రోవం బోవఁడాత్మీయతల్
చెంతం జేరగనీఁడు స్వార్థ విషముం జిత్తంబులో నింపు దా
నెంతే పండితు నంచు మించు ఖలుఁడింతే లోకమో పావనీ.

95.అభిమానంబును మానముం బ్రతిభయున్ వ్యాపారమున్నేర్పు
నోర్పు భివేశంబును వీఁడు మందమతు లన్యాయత్త సిద్ధుల్ శుభం
బభమున్ సౌఖ్యమెఱుంగ లేక సతమీహా మోహసందోహ
దుఃఖభ సంసార పయోధిఁ గ్రుంకెదరుకట్టా చూచితే పావనీ!

95.నీరూపంబుఁ గనుంగొనన్ సురలకే నిన్ శక్యమే స్వామి నో
రారన్ స్తోత్రము సేయసత్కవులె నేరం జాలరే సర్వలో
కారాధ్యుండవు భక్తరక్షణ గుణైకాయత్త చిత్తుండ వీ
వే రా రమ్మని చేరఁ బిల్చి కరుణ న్వీక్షింపవే పావనీ!

96.ప్రారంభించితి సార్వభౌముఁడ! భవత్పాదాబ్జ యుగ్మంబునే
నారాధింపఁగ సర్వలోక హితునిం బ్రార్థించినన్ మోక్షల
క్ష్మీరాజ్యంబున పట్టభద్రుఁడగు వాసిం గాంచు సంపత్తిచే
నారా సుంత గ్రహింప రేల జను లీయౌచిత్యమున్ బావనీ

97.పదమా సాగదు పద్యమా నడువ దే భావంబునుం గల్గదు
ద్య దలంకార రసాభివృద్ధి కనరా దర్థంబు వ్యర్థంబె యు

భ్యుదయం బెచ్చట గల్గకుండు విబుధుల్ భూషింపగాఁ బోరుత్వ
త్పదసేవారతి లేని దుష్కవుల కావ్యంబుల్ వృథా పావనీ.

98. రణరంగంబున శాత్రవుల్ భయపడన్ రామన్నకున్ బాసటై
ప్రణుతింపందగు బాహువిక్రమమునం భంజించినా వయ్యరా
వణ ముఖ్యాసుర వైరివీరులను దివ్యస్తుత్య దోశ్శక్తివై
గణనాతీతము నీప్రభావము మదిం గల్యాణదా! పావనీ!

99. శ్రీరామప్రభు భక్తి జ్ఞాని వగుచుం జిత్తంబు రంజిల్ల నీ
వారాధించితి రేబవల్ నియత కృత్యంబుల్ విధానంబుగా
లేరే జ్ఞానులు భక్తిమార్గనిరతుల్నిన్నుంబలెన్ మోక్షల
క్ష్మీరామా హృదయజ్ఞులై వెలసిరే క్షేమంకరా। పావనీ.

100. శరణంటిం జరణంబు లంటి పరమేశా! బంటునై యుంటిని
న్నరయం గంటిని వేడుకొంటి దగనింటన్నింట నభ్యున్నతుల్
దొరకొంటిన్నెలకొంటి నీకనులముందున్ మంటి నేనొంటిని
కరుణన్ జంటనుగా జిరంటి కవితన్ గైకొంటిగా పావనీ.

101. సురసాగర్వ వినాశనా! గుణనిధీ! శూరోత్తమా! సింహికా
ఖర విక్రాంతి వనీదవానల! నిజస్కంధద్వయానీత భూ
వర సీతాపతి లక్ష్మణద్వయ మహావాలప్రయుక్త ప్రభా
స్వరసింహాసన! ధిక్కృతాఖిల దనూజా కావుమా పావనీ.

102. శ్రీరామావనిపాల పాదయుగళీ చింతామృతాస్వాదధా
రా రాదంచిత మానస ప్రసృమర ప్రత్యగ్ర జాగ్రద్వివే
కారంభస్థితి హేతుభూత నిజమాత్మాః దుఃరాధర్ష దో
స్సా రాశోకవనీవిహార చతురా! సాధుప్రియా! పావనీ.

103. గతికల్పించె నవిద్య మాన్పె కరుణన్ గాపాడె నిర్వ్యాజతన్
సుతభావంబున నెంచి పెంచె విబుధస్తోమంబు మెచ్చంగనా

కృతి కీయాకృతిఁ గల్గఁజేయు సుకృతిన్ గీర్తింతు బ్రార్థింతు న
న్నత సౌఖ్యంబులు సత్యదేవునకు చెందం గోర్కెనో పావనీ!

104. ధర నే వెంకటరామశాస్త్రి సుతుడన్ దాదల్లి లక్ష్మాంబ స
ద్వారముల్ గాంచిసుతుండనై జననమందన్ భాగ్యమే నందితిన్
కరుణా పూరిత మానసాంబుజులు! సత్సాహిత్య సౌజన్యలి
ప్తసుఁగా భక్తిని వారి నే ననిశమున్ ధ్యానింతునో పావనీ!

105 హృదయావేదన తీరు సంపదల కెంతే దావలంబై మనన్
ముదమున్ బొందు శుభాస్పదంబగుచు బెంపున్ గాంచు
దర్శించు భూ
తదయున్ సర్వము లోకపూజ్యుఁడగు నంతశ్శ్రద్ధని న్నెప్పుడున్
మది సేవించెడు భక్తపుంగవుఁడ సామాన్యంబుగా పావనీ!

106. సంకల్పించిన కార్యసిద్ధి కలుగున్ సద్ధర్మ సంధానమా
శంకల్ మానును జంకునుం దొలగు సంసారార్ణవంబందు నే
పంకంబంటక మోక్షమార్గ గతిఁ బ్రాబల్యంబు ప్రాప్తించు
నిన్ సంకోచింపక గొల్చుజీవులకు నోజన్ సత్యమో పావనీ!

107. శతకం బిమ్మయి భక్తి విన్న జదువన్ సర్వార్థసిద్ధుల్ గనన్
సతతాయుష్య సుఖానుభూతి కలుగున్ సద్వ్యాప్తి లభ్యంబగున్
మతిమంతుండగు సౌమనస్యమున శోమ్మా దక్షిణామూర్తి నీ
కృతిఁ జేబూనితి నెల్లవారలును నిన్ గీర్తింపగా బావనీ!

108. ఇటు లష్టోత్తర హృద్య పద్య శతకం బేనిచ్చి పూజించితిన్
ఘటనా చాతురి మీఱఁ గావ్యరచనల్ గావింపగా జాలును
ద్భట శాస్త్ర ప్రతిభా సమన్వితునిగా ధర్మార్థ కామంబులో
క్కటి సాధించు సమర్థుగా మనుపగా గాక్షింతునో పావనీ!

---

# విజయ్ పెన్ వర్క్సు

బోస్ రోడ్ - తెనాలి.

D. No. 22-11-111

ఉళక్కి హాస్పటల్ ఎదురుగా

మా వద్ద అన్నిరకముల కలములు అమ్మబడును.

గ్యారంటీగా రిపేరుచేయబడును.

ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన (ఎబోనైటు) మెటల్‌తో సరిక్రొత్త డిజైన్లులో బాల్ పెన్సు, టేబుల్ పెన్సు, స్టిక్ పెన్సు, మరియు అన్నిరకముల కలములు తయారు అగును. మా మెటల్‌తో మీరు కోరిన పార్టులు చేసియివ్వబడును.

మా వద్ద హోల్‌సేలుగాను రిటైలుగాను సరసమైన ధరలకు విక్రయించబడును.

త్వరలో

## విజయ్ ఎలక్ట్రో ప్లేటింగ్

సెక్షన్ ప్రారంభించబడును.

అన్నిరకముల వస్తువులకు ప్లేటింగ్ వేయబడును.